సంగీత జగద్గురు

# శ్రీ త్యాగరాజ కీర్తనలు

(తృతీయ సంపుటము)



సంకలనము :

ఖాపరాజు నరసింహారావు





శ్లో. శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి.

త్రివేణి పబ్లిషర్సు ప్రైవేట్ లిమిటెడ్
మచిలీపట్నం - 521 001

# మనవి

వాల్మీకి, వ్యాసుడు, జయదేవుడు, పోతన మున్నగు మహనీయులు భారతావనిని పునీతమొనర్చిన ఋషిపుంగవులు. కావేరీ తీరమున జన్మించి వేలకొలది తెలుగు కీర్తనలను రచించిన త్యాగరాజు యీ ఋషిపరంపరలోనివాడు. ఈ మహనీయుడు భక్తిమార్గమును బోధించుటకు సంగీత సాహిత్యములను రెండింటిని మేళవించి తన కీర్తనలను చక్కని జాతీయమగు తేట తెలుగు భాషలో వ్రాసి యున్నాడు. ఈ కీర్తనలను ఎందరో సంగీతోపాసకులు శ్రవణపేయముగా గానము చేసి తమ జీవితములను ధన్య మొనరించుకొనినారు.

త్యాగరాజు రచించిన వేలకొలదిగల కీర్తనలలో మనకు ప్రస్తుతము కొన్నివందలు మాత్రము లభ్యమగుచున్నవి. వాటిలో బహుళ ప్రచారము నంది సర్వసామాన్యముగ సంగీత కచేరీలలో గానము చేయబడెడి ముఖ్యమగు కీర్తనలను కొన్నిటిని చేర్చి ప్రథమ, ద్వితీయ సంపుటములుగ ప్రచురించినాము. ఆ సంకలనములు బహుళ ప్రచారము నందినవి.

ఇపుడు అట్టివే మరికొన్ని కీర్తనలను సేకరించి తృతీయ సంపుటముగ వెలువరించు చున్నాము. ఆంధ్ర రసజ్ఞలోకము ఈ గ్రంథమునుకూడ ఆదరించగలదని ఆశించుచున్నాము.

భావరాజు నరసింహారావు
సంకలన కర్త

# కీర్తనల అకారాదిక సూచిక

సంగీత జగద్గురు

# శ్రీ త్యాగరాజ కీర్తనలు

## 1

నాథనామక్రియ రాగము — ఆది తాళము

ప. కరుణా జలధే దాశరథే
కమనీయానన సుగుణనిధే ॥క॥

చ. నీ మయమేగా నిలను
నేమని నే దూరుదును ॥క॥

నిజదాసుల యనుభవ మొకటి
నిను తెలియని జనమత మొకటి ॥క॥

వలచుచు నామము జేయుదురే నిను
దలచుచు ప్రొద్దు పోగొట్టుదురే ॥క॥

సుకృతము లొప్పగింతురే నీ
ప్రకృతిని దెలిసి యేగింతురే ॥క॥

మనసారగ బూజింతురే నిను
మాటి మాటికి యోచింతురే ॥క॥

నిను గనులను కన కోరుదురే నవ
నిధు లబ్బిన సుఖమును కోరరే ॥క॥

నీ వన్నిటయని పలుకుదురే
నీవే తానని కుల్కుదురే ॥క॥
తమలో మెలగుచు నుందురే
తారకరూపుని కందురే ॥క॥
భాగవత ప్రహ్లాదహిత రామ
భావుక త్యాగరాజనుత ॥క॥

## 2

కానడ రాగము — రూపక తాళము

ప. శ్రీ నారద ! నాద సరసీరుహ భృంగ ! శుభాంగ ॥శ్రీ॥
అ. దీనమానరక్షక ! జగదీశ ! భేశ సంకాశ ! ॥శ్రీ॥
చ. వేదజనిత వరవీణానాదన తత్త్వజ్ఞ !
ఖేదకర త్రితాపరహిత ఖేచరవినుత !
యాదవకులజాప్త ! సదా మోదహృదయ ! మునివర్య !
శ్రీద ! త్యాగరాజవినుత ! శ్రీకర ! మాం పాలయ ॥శ్రీ॥

## 3

ముఖారి రాగము — ఆది తాళము

ప. మురిపెము గలిగె గదా రామ స
న్మునినుత కరివరద శ్రీరామ ॥ము॥
అ. పరమపురుష జగదీశ వరమృదు
భాష సుగుణమణికోశ నీకు ॥ము॥

చ. ఈడులేని మలయమారుతముచే
గూడిన కావేరి తటమందు
మేడల మిద్దెలతో శృంగారము
మించు సదనములలో
వేడుచు భూసురు లగ్నిహోత్రులై
వేదఘోషములచే నుతియింప
జూడ శివుడు గోరు యోగ్యమైన
సుందరమగు పురము దొరికె ననుచు ॥ము॥

సకల సుగంధరాజ సుమములు
సలలితమగు కోకిల నాదమ్ములు
శుకముఖ సనకాదుల నుతమైన
సురతరువులు గలిగి
నికటమందు వాణి కొలువ సురపతి
నీలమణినిభశరీర నేడు
ప్రకటమైన నవరత్నఖచిత హా
టకమంటపవాసము గలిగె ననుచు ॥ము॥

ఈ మహిలో సొగసైన చోళ
సీమయందు వరమైన పంచనదపుర
ధాముని చెంతను వసించుటకై
నీమది నెంచగ
కామజనక త్యాగరాజ సన్నుత
నామ పవనతనయ విధృతచరణ

క్షేమముగ వర్ధిల్లునట్టి పురమున సీతా
భామ సౌమిత్రి ప్రక్క గొలిచెదరని

## 4

సారంగ రాగము — చాపు తాళము

ప. ఏహి త్రిజగదీశ శంభో మాం పాహి పంచనదీశ

అ. వాహినీశ రిపునుత శివసాంబ
దేహి త్వదీయ కరాబ్జావలంబమ్

చ. గంగాధర ధీర నిర్జర రిపుపుంగవ సంహార
మంగళకర పురభంగవిధృత సుకు-
రంగాప్త హృదయాబ్జభృంగ శుభాంగ
వారణాజినచేల భవనీరధితారణ సురపాల
క్రూర లోకాభ్ర సమీరకరణ శుభ్ర శ-
రీర మామకాఘహర పరాత్పర
రాజశేఖర కరుణాసాగర నగరాజాత్మజా రమణ
రాజరాజ పరిపూజితపద త్యాగ-
రాజరాజ వృషరాజాధిరాజ

## 5

మధ్యమావతి రాగము — ఆది తాళము

ప. ముచ్చట బ్రహ్మాదులకు దొరకునా
ముదితలార జూతము రారె

అ. పచ్చని దేహిని పరమ పావనిని
పార్వతిని దలచుచును హరు డేగెడు ॥ము॥

చ. చల్లరే వేల్పులరీతి విరుల కర
పల్లవములను తళుక్కనుచు బిరుదు
లెల్ల మెరయ నిజభక్తులు పొగడగ
ఉల్లము రంజిల్ల
తెల్లని మేనున నిండు సొమ్ములతో
మల్లెహారములు మరి శోభిల్లగ
చల్లనివేళ సకల నవరత్నపు
పల్లకిలో వేంచేసి వచ్చు ॥ము॥

హితమైన సకల నైవేద్యంబుల సం_
మతమున అడుగడుగు కారగింపుచు
మితములేని యుపచారములతో
నతి సంతోషమున సతతము జ_
ప తపముల నొనరించు
నత జనుల కభీష్టము లవ్వారిగ
వెతకి యొసగుదు ననుచు పంచనదీ_
పతి వెడలి సొగసుమీరగ వచ్చు ॥ము॥

భాగవతులు హరినామకీర్తనము
బాగుగ సుస్వరములతో వింత
రాగములను యాలాపముచేయు వై_
భోగములను జూచి

నాగభూషణుడు కరుణానిధియై
వేగము సకల సుజనరక్షణమున
జాగరూకుడై కోర్కెల నొసగు
త్యాగరాజు తా ననుచును వచ్చు ||ము||

## 6

అఠాణ రాగము — ఆది తాళము

ప. ఇలలో ప్రణతార్తిహరు డనుచు పే
రెవ రిడిరే శంకరు డని నీ ||కిల||

ప. దలచి కరగి చిరకాలము పదమున
దండమిడిన నాయెడ దయలేదాయె ||ఇ||

చ కరచరణయుగము నొసలు భుజములు
ధరణిసోక మ్రొక్కగలేదా?
శరణనుచును మొరలిడ లేదా? పం_
చనదీశ త్యాగరాజనుత నీ ||కి||

## 7

రీతిగౌళ రాగము — ఆది తాళము

ప. బాలే బాలేందు భూషణి
భవరోగశమని ||బా||

అ. ఫాలలోచని శ్రీధర్మసంవర్ధని
సకలలోకజనని ||బా||

చ. శీలే నను రక్షింపను జా_
గేలే పరమపావని సుగుణ_
జాలే నతజనపరిపాలన
లోలే కనకమయ సు_
చేలే కాలవైరికి ప్రియమైన ఇ_
ల్లాలవై యిందు వెలసినందుకు శ్రీ
లలితే నీ తనయుడని నను గు_
ణాలుగా పిలువవలెనమ్మ ॥బా॥
సారే సకల నిగమవన సం_
చారే చపలకోటి నిభ శ_
రీరే దేవతాంగన పరి_
వారే పామరజన_
దూరే కీరవాణి శ్రీ పంచనదపుర వి_
హారివై వెలసినందు కిక నా
నేర కోటులనెల్ల సహించి
గారవింపవలెనమ్మ శివే ॥బా॥
రామే ప్రణతార్తిహరాభి_
రామే దేవకామిని ల_
లామే త్యాగరాజ భజన స_
కామే దుర్జనగణ_

భీమే నా మనసున నీ చరణముల సదా
నేమముతో పూజసేయ నీ శ్రీ
రామ సోదరివై వెలసిన శ్రీ
శ్యామలే ధర్మ సంవర్ధని ॥బా॥

8

భైరవి రాగము — అది తాళము

ప. లలితే శ్రీప్రవృద్ధే శ్రీమతి
లావణ్యానిధిమతి ॥ల॥

అ. తెలివిని వర్ధిల్లు శ్రీ తపస్తీర్థనగర నిలయే ॥ల॥

చ. తెలియని బాలుడగాదా? అంబ
తెలివి నీసొమ్ముగాదా?
చలముసేయ మరియాదా?
చల్లని మాటలు బల్కరాదా? ॥ల॥
బ్రోచువా రిలను లేక
జూచిచూడక పరాకా?
యీ సుజనుల వేడగలేక
నే దాసుడ నీవేగతి గాక ॥ల॥
కన్నతల్లి శుభవదనే మీ-
యన్నదయకు పాత్రుడనే
తిన్నగ శరణము జొచ్చితినే
త్యాగరాజ మానస సదనే ॥ల॥

సంగీత జగద్గురు

# శ్రీ త్యాగరాజ కీర్తనలు

## 1

నాథనామక్రియ రాగము — ఆది తాళము

ప. కరుణా జలధే దాశరథే
కమనీయానన సుగుణనిధే ॥క॥

చ. నీ మయమేగా నిలను
నేమని నే దూరుదును ॥క॥

నిజదాసుల యనుభవ మొకటి
నిను తెలియని జనమత మొకటి ॥క॥

వలచుచు నామము జేయుదురే నిను
దలచుచు ప్రొద్దు పోగొట్టుదురే ॥క॥

సుకృతము లొప్పగింతురే నీ
ప్రకృతిని దెలిసి యేగింతురే ॥క॥

మనసారగ బూజింతురే నిను
మాటి మాటికి యోచింతురే ॥క॥

నిను గనులను కన కోరుదురే నవ
నిధు లబ్బిన సుఖమును కోరరే ॥క॥

నీ వన్నిటయని పలుకుదురే
నీవే తానని కుల్కుదురే ॥క॥
తమలో మెలగుచు నుందురే
తారకరూపుని కందురే ॥క॥
భాగవత ప్రహ్లాదహిత రామ
భావుక త్యాగరాజనుత ॥క॥

## 2

కానడ రాగము — రూపక తాళము

ప. శ్రీ నారద ! నాద సరసీరుహ భృంగ ! శుభాంగ ॥శ్రీ॥
అ. దీనమానరక్షక ! జగదీశ ! భేశ సంకాశ ! ॥శ్రీ॥
చ. వేదజనిత వరవీణానాదన తత్వజ్ఞ !
ఖేదకర త్రితాపరహిత ఖేచరవినుత !
యాదవకులజాప్త ! సదా మోదహృదయ ! మునివర్య !
శ్రీద ! త్యాగరాజవినుత ! శ్రీకర ! మాం పాలయ ॥శ్రీ॥

## 3

ముఖారి రాగము — ఆది తాళము

ప. మురిపెము గలిగె గదా రామ స
న్మునినుత కరివరద శ్రీరామ ॥ము॥
అ. పరమపురుష జగదీశ వరమృదు
భాష సుగుణమణికోశ నీకు ॥ము॥

చ. ఈడులేని మలయమారుతముచే
గూడిన కావేరి తటమందు
మేడల మిద్దెలతో శృంగారము
మించు సదనములలో
వేడుచు భూసురు లగ్నిహోత్రులై
వేదఘోషములచే నుతియింప
జూడ శివుడు గోరు యోగ్యమైన
సుందరమగు పురము దొరికె ననుచు ॥ము॥
సకల సుగంధరాజ సుమములు
సలలితమగు కోకిల నాదమ్ములు
శుకముఖ సనకాదుల నుతమైన
సురతరువులు గలిగి
నికటమందు వాణి కొలువ సురపతి
నీలమణినిభశరీర నేడు
ప్రకటమైన నవరత్నఖచిత హా
టకమంటపవాసము గలిగె ననుచు ॥ము॥
ఈ మహిలో సొగసైన చోళ
సీమయందు వరమైన పంచనదపుర
ధాముని చెంతను వసించుటకై
నీమది నెంచగ
కామజనక త్యాగరాజ సన్నుత
నామ పవనతనయ విధృతచరణ

క్షేమముగ వర్ధిల్లునట్టి పురమున సీతా
భామ సౌమిత్రి ప్రక్క గొలిచెదరని

## 4

సారంగ రాగము — చాపు తాళము

ప. ఏహి త్రిజగదీశ శంభో మాం పాహి పంచనదీశ

అ. వాహినీశ రిపునుత శివసాంబ
దేహి త్వదీయ కరాబ్జావలంబమ్

చ. గంగాధర ధీర నిర్జర రిపుపుంగవ సంహార
మంగళకర పురభంగవిధృత సుకు-
రంగాప్త హృదయాబ్జభృంగ శుభాంగ
వారణాజినచేల భవనీరధితారణ సురపాల
క్రూర లోకాభ్ర సమీకరణ శుభ్ర శ-
రీర మామకాఘహర పరాత్పర
రాజశేఖర కరుణాసాగర నగరాజాత్మజా రమణ
రాజరాజ పరిపూజితపద త్యాగ-
రాజరాజ వృషరాజాధిరాజ

## 5

మధ్యమావతి రాగము — ఆది తాళము

ప. ముచ్చట బ్రహ్మాదులకు దొరకునా
ముదితలార జూతము రారె

అ. పచ్చని దేహిని పరమ పావనిని
పార్వతిని దలచుచును హరు డేగెడు ॥ము॥

చ. చల్లరే వేల్పులరీతి విరుల కర
పల్లవములను తళుక్కనుచు బిరుదు
లెల్ల మెరయ నిజభక్తులు పొగడగ
ఉల్లము రంజిల్ల
తెల్లని మేనున నిండు సొమ్ములతో
మల్లెహారములు మరి శోభిల్లగ
చల్లనివేళ సకల నవరత్నపు
పల్లకిలో వేంచేసి వచ్చు ॥ము॥

హితమైన సకల నైవేద్యంబుల సం_
మతమున అడుగడుగు కారగింపుచు
మితములేని యుపచారములతో
నతి సంతోషమున సతతము జ_
ప తపముల నొనరించు
నత జనుల కభీష్టము లవ్వారిగ
వెతకి యొసగుడు ననుచు పంచనదీ_
పతి వెడలి సొగసుమీరగ వచ్చు ॥ము॥

భాగవతులు హరినామకీర్తనము
బాగుగ సుస్వరములతో వింత
రాగములను యాలాపముచేయు వై_
భోగములను జూచి

నాగభూషణుడు కరుణానిధియై
వేగము సకల సుజనరక్షణమున
జాగరూకుడై కోర్కెల నొసగు
త్యాగరాజు తా ననుచును వచ్చు

6

అఠాణ రాగము — ఆది తాళము

ప. ఇలలో ప్రణతార్తిహరు డనుచు పే
రెవ రిడిరే శంకరు డని నీ
ప. దలచి కరగి చిరకాలము పదమున
దండమిడిన నాయెడ దయలేదాయె
చ కరచరణయుగము నొసలు భుజములు
ధరణిసోక మ్రొక్కగలేదా?
శరణనుచును మొరలిడ లేదా? పం_
చనదీశ త్యాగరాజనుత నీ

7

రీతిగౌళ రాగము — ఆది తాళము

ప. బాలే బాలేందు భూషణి
భవరోగశమని
అ. ఫాలలోచని శ్రీధర్మసంవర్ధని
సకలలోకజనని

చ. శీలే నను రక్షింపను జా_
గేలే పరమపావని సుగుణ_
జాలే నతజనపరిపాలన
లోలే కనకమయ సు_
చేలే కాలవైరికి ప్రియమైన ఇ_
ల్లాలవై యిందు వెలసినందుకు శ్రీ
లలితే నీ తనయుడని నను గు_
ణాలుగా పిలువవలెనమ్మ ॥బా॥

సారే సకల నిగమవన సం_
చారే చపలకోటి నిభ శ_
రీరే దేవతాంగన పరి_
వారే పామరజన_
దూరే కీరవాణి శ్రీ పంచనదపుర వి_
హారివై వెలసినందు కిక నా
నేర కోటులనెల్ల సహించి
గారవింపవలెనమ్మ శివే ॥బా॥

రామే ప్రణతార్తిహరాభి_
రామే దేవకామిని ల_
లామే త్యాగరాజ భజన స_
కామే దుర్జనగణ_

భీమే నా మనసున నీ చరణముల సదా
నేమముతో పూజసేయ నీ శ్రీ
రామ సోదరివై వెలసిన శ్రీ
శ్యామలే ధర్మ సంవర్ధని

8

భైరవి రాగము — ఆది తాళము

ప. లలితే శ్రీప్రవృద్ధే శ్రీమతి
లావణ్యనిధిమతి

అ. తెలివిని వర్ధిల్లు శ్రీ తపస్తీర్థనగర నిలయే

చ. తెలియని బాలుడగాదా? అంబ
తెలివి నీసొమ్ముగాదా?
చలముసేయ మరియాదా?
చల్లని మాటలు బల్కరాదా?
బ్రోచువా రిలను లేక
జూచిమాడక పరాకా?
యీ సుజనుల వేడగలేక
నే దాసుడ నీవేగతి గాక
కన్నతల్లి శుభవదనే మీ-
యన్నదయకు పాత్రుడనే
తిన్నగ శరణము జొచ్చితినే
త్యాగరాజ మానస సదనే

## 9

ముఖారి రాగము — దేశాది తాళము

ప. సంగీతశాస్త్ర జ్ఞానము సారూప్య సౌఖ్యదమే మనసా ॥సం॥

అ. శృంగార రసాద్యఖిలసార పూ-
రిత రామకథానందాబ్ధియుత ॥సం॥

చ. ప్రేమభక్తి సుజనవాత్సల్యము
శ్రీమద్రమావర కటాక్షము
నేమ నిష్ట యశోధన మొసంగునే
నేర్పుగల్గు త్యాగరాజు నేర్చిన ॥సం॥

## 10

పంతువరాళి రాగము — చాపు తాళము

ప. సారమేగాని యన్యమార్గ వి-
చార మేటికే? ఓ మనసా ॥సా॥

అ. వారు వీరు దెలియలేక బల్కు
వార్తలు విన నేలే? రామనామము ॥సా॥

చ. మారకోటిలావణ్యుడైన రఘు
వీరుని నామసుధారసమును
సారెకు బానము జేసి జగద్వి-
హారుడై వెలయు నారాయణ

నారాయణ యనుచును వారము
శరదంబుద నిభుడౌ శ్రీ
నారదముని వల్మీకజాతునికి
గూరిమి నుపదేశించలేదా

వరమపావనుని శరణాగతజన-
పరిపాలన బిరుదాంకుని సీతా-
వరుని నామసుధారస పానము
నిరతమునను జేసి హరి హరి

హరి యనుచు సంతతంబును
సరియులేని కీర్తిగాంచి దేహము
పరవశంబు జెంది శుకబ్రహ్మ
పరీక్షిత్తు కొసగలేదా ? వాదా

సామగానలోలుడౌ రజితగిరి
ధాముడైన త్యాగరాజశివు డతి
నేమముతో నామామృత పానము
యేమరకను జేసి రామ రామ

రామ యనుచు సతతము
శ్రీమదాదిగౌరికి శృంగారికి
యా మహిమల నా రహస్యముల నతి
ప్రేమను యుపదేశించ లేదా ?

## 11

మధ్యమావతి రాగము — ఆది తాళము

ప. రామనామం భజరే మానస ॥రా॥

చ. దొంగరీతి తిరుగంగ నేల శ్రీ
రంగని పదముల కౌగిలించుకొని ॥రా॥
ఎక్కడైన హరి యొక్క డనుచు మది
చక్కదనముగని సొక్కి సంతతము ॥రా॥
ఎందుబోక రాకేందుముఖుని నీ
యందు జూచి ఫలమందుకోర శ్రీ
దేహమెత్తి సందేహపడక వై_
దేహి భాగ్యమా దేహి దేహి యని ॥రా॥
సాధు సజ్జనులు బోధచేత భవ
బాధ మానవలె సాధకంబుతో
రాగరహిత జనభాగదేయుని వి_
నా గతియెవ్వరే త్యాగరాజనుత ॥రా॥

## 12

కాపి రాగము — చాపు తాళము

ప. అతడే ధన్యుడురా ఓ మనసా ॥అ॥

అ. సతతయాన సుతధృతమైన సీతా_
పతి పాదయుగముల సతతము స్మరియించు ॥స॥

చ. వెనుకదీక తనమనసు రంజిల్లగ
ఘనమైన నామకీర్తన పరుడైనట్టి
తుంబురువలె తన తంబురబట్టి ద-
యాంబుధి సన్నిధానంబున నటియించు
సాయకు సుజనుల బాయకు తాను ను-
పాయమునను ప్రొద్దు హాయిగ గడిపిన
ఉల్లపు తాపము చల్లజేసి యన్ని
కల్లలనుచు యెంచి సల్లాపమున నుండు
కరివరదుని తత్త్వమెరుగను మరిగించు
అరిషడ్వర్గములందు బరవలేక దిరుగు
ఆర్తిని మరియు ప్రవృత్తిని దొలగించు
కీర్తి గల్గిన రామమూర్తిని నెఱ నమ్ము
కలగని జని విప్రకులమున జన్మించి
నిలువర మగు ముక్తిఫలమును జేకొన్న
కర్మనిష్ఠుడైన ధర్మశీలుడైన
శర్మ రామనామ మర్మము దెలిసిన
కాసువీసముల కోసము యాసతో
వేసము ధరియించి మోసము జెందని
అందముగా నామ మందరు జేసిన
సుందర రామునియందు లక్ష్యము బెట్టు

ఇన్నిపాటులకు సర్వోన్నతమౌ సుఖ-
మున్న యనుభవించు కొన్నవా డెవడో ॥అ॥
రాజస జనులతో దా జత గూడక
రాజిల్లు శ్రీ త్యాగరాజనుతుని నమ్మ ॥న॥

## 13

నాయకి రాగము — రూపక తాళము

ప. కనుగొను సౌఖ్యము
కమలజుకైన గల్గునా? ॥క॥

అ. దనుజవైరి యగు రాముని
దయ గల్గిన నతని వినా ॥క॥

చ. తను వొకచో మన సొకచో
దగిన వేషమొకచో నిడి జనుల సేచు వారికి
జయమౌనే? త్యాగరాజ ॥క॥

## 14

జయమనోహరి రాగము — రూపక తాళము

ప. నీ భక్తి భాగ్య సుధా
నిధి నీదేదే జన్మము? ॥నీ॥

అ. భూభారముగాని సుర
భూసురులై జనించిన ॥నీ॥

చ. వేదోక్తంబౌ కర్మము
వెతగల్గు గతాగతమౌ
నాదాత్మక త్యాగరాజ
నాథా ప్రమేయ! సదా

15

జయమనోహరి రాగము — ఆది తాళము

ప. యజ్ఞాదులు సుఖమను వారికి సము_
లజ్ఞానులు గలరా? ఓ మనసా!
అ. సుజ్ఞాన దరిద్ర పరంపరు ల_
సురచిత్తులు జీవాత్మ హింసగల
చ. బహు జన్మంబుల వాసనయుతులై
అహి విషసమ విషయాకృష్టులై
బహిరాననులై త్యాగరాజు
భజియించు శ్రీరాముని దెలియక

16

కళ్యాణి రాగము — రూపక తాళము

ప. భజనసేయవే మనసా!
పరమభక్తితో
అ. అజరుద్రాదులకు భూసు
రాదుల కరుదైన రామ

చ. నాదప్రణవ సప్తస్వర
వేదవర్ణ శాస్త్ర పురా-
ణాది చతుష్షష్టికళల
భేదము కలిగే
మోదకర శరీరమెత్తి
ముక్తి మార్గమును దెలియని
వాదతర్కమేల శ్రీ
మదాది త్యాగరాజనుతుని ॥భ॥

## 17

శంకరాభరణ రాగము — రూపక తాళము

ప. భక్తి బిచ్చ మియ్యవే
భావుకమవు సాత్వీక ॥భ॥

అ. ముక్తి కఖిల శక్తికి త్రి
మూర్తుల కతి మేల్మి రామ ॥భ॥

చ. ప్రాణము లేనివానికి బంగారుపాగ చుట్టి
ఆణి వజ్రభూషణ మురమందు బెట్టు రీతి
జాణలకు బురాణాగమశాస్త్ర వేదజపప్రసంగ
త్రాణ గల్గి యేమి? భక్తత్యాగరాజనుత రామ ॥భ॥

## 18

ధన్యాసి రాగము — రూపక తాళము

ప. శ్యామ సుందరాంగ
సకల శక్తియు నీవేర

అ. తామసరహిత గుణసాంద్ర
ధరను వెలయు రామచంద్ర

చ. దుష్టదనుజ మద విదార
శిష్టజన హృదయ విహార
ఇష్టదైవము నీవేర
యిలను త్యాగరాజు వేర

## 19

సురటి రాగము — దేశాది తాళము

ప వేరెవ్వరేగతి ?
వేమారులకు సీతాపతి

అ. ఈరేడు లోకముల కా
ధారుడవగు నిను వినా

చ. బృందారకాది మునిబృంద శుక సనక స_
నందన శ్రీ నారదారవిందోద్భవ పు_
రందరులకు శ్రీ త్యాగరాజునికి నిను వినా

## 2 0

కళ్యాణి రాగము — ఆది తాళము

ప. కారు వేల్పులు నీకు సరి ||కా||

అ. కారుకు జిలకరసంబా_
కంతరమైనట్లు గాని త్రిగుణా ||కారు||

చ. దివటికి దీపము రీతి
కావేటికి కాలువలరీతి గాని ||కా||
తమ్మ వైరికి దారకల రీతి
కమ్మవిల్తునికి కాంతి నరులరీతి గాని ||కా||
సాగరానికి సరస్సురీతి
త్యాగరాజవినుత ధరలో నీకు సరి ||కా||

## 2 1

కోలాహల రాగము — దేశాది తాళము

ప. మదిలోన యోచన పుట్టలేదా ?
మహారాజ రాజేశ్వరా ! ||మ||

అ. పది వేసములలో రామవేసము
బహు బాగనుచు గోరు నన్ను బ్రోవ ||మ||

చ. ఇట్టివేళ నీ కెట్టు తోచునని
ఇల్లాలితో ముచ్చటాడెదు ? నా_
రట్టు నీ మనసు కెట్టు తోచెనో
రక్షించుటకు త్యాగరాజనుత ||మ||

## 22

దేవమనోహరి రాగము — చాపు తాళము

ప. ఎవరికై యవతార మెత్తితివో
ఇపుడైన దెలుపవయ్యా రామయ్యా నీ

అ. అవనికి రమ్మని పిలిచిన మహారా_
జెవడో వానికి మ్రొక్కెద రామ

చ. వేదవర్ణనీయమౌ నామముతో
విధి రుద్రులకు మేల్మియగు రూపముతో
మోదసదనమగు పటుచరితముతో
మునిరాజవేషియౌ త్యాగరాజనుత

## 23

సూర్యకాంత రాగము — ఆది తాళము

ప. ముద్దుమోము ఏలాగు చెలంగెనో ?
మును లెటుల గని మోహించిరో ?

అ. కద్దనుచును జిరకాలము హృదయము
కరగి కరగి నిల్చువారి కెదుట రాముని

చ. మనసు నిర్మలమగు భూసుర కృతమో
మంచి పూజాఫలమో తొలుతటి తపమో
ఘననిభదేహుని జనన స్వభావమో
ధనపతి సఖుడైన త్యాగరాజార్చితుని

## 24

రామప్రియ రాగము — దేశాది తాళము

ప. సందేహమును దీర్పవయ్యా
సాకేతనిలయ రామయ్యా ॥సం॥

అ. నందార్చిత పదయుగములు మేలో
నాగరికమగు పాదుకాయుగములు మేలో ॥సం॥

చ. వరమౌను లెల్ల చరణంబులను
స్మరియింప నీదుపద మొసంగెనె
భరతార్చనచే పాదుకలు
ధరణి నిన్నొసగె త్యాగరాజభాగ్యమా ॥సం॥

## 25

పూర్వషడ్జమ రాగము — రూపక తాళము

ప. లావణ్యరామ కన్ను
లార జూడవే అతి ॥లా॥

అ. శ్రీవనితా చిత్త కుముద
శీతకర శతానన్యజ ॥లా॥

చ. నీ మనసు నీ సొగసు
నీ దినుసు వేరే
తామసమత దైవమేల
త్యాగరాజనుత దివ్య ॥లా॥

## 26

మాయామాళవగౌళ రాగము — దేశాది తాళము

ప. మేరుసమానధీర ! వరద ! రఘు
వీర ! జూతాము రారా మహా

అ. సారసార ఒయ్యారపు నడలను
నీరదకాంతిని నీ ఠీవిని మహా

చ. అలకల ముద్దును తిలకపు తీరును
తళుకు జెక్కులచే దనరు నెమ్మోమును
గళమున శోభిల్లు కనక భూషణముల
దళిత దుర్మానవ త్యాగరాజార్చిత

## 27

నవరసకన్నడ రాగము — దేశాది తాళము

ప. పలుకు కండచక్కెరను గేరునే
పణతులారా ! చూడరే

అ. కొలువుకూటమునను గొలుచువారిని
బిలచి దాశరథి ప్రేమమీర బలికె

చ. సురల కామినీమణుల గాన మా-
దరణ నాలకించుచును శృంగా-
ర రసయుక్త వార రమణు లాడజూచి-
సరస త్యాగరాజునితోను బొగడే

## 28

నారాయణగౌళ రాగ — ఆది తాళము

ప. కదలేవాడుకాడే రాముడు
కథలెన్నో కలవాడే ॥క॥

అ మొదలే తానైనాడే తుద
మొదలే లేనివాడైనాడే ॥క॥

చ కల్పన లెన్నడులేడు సం
కల్పములే కలవాడు శేష-
తల్పశయనుడే వాడు శ్రీ
త్యాగరాజనుతుడైనాడే ॥క॥

## 29

సింహవాహినీ రాగము — దేశాది తాళము

ప. నెనరుంచరా నాపైని చాల
నీ దాసుడను కాదా? శ్రీరామ ॥నె॥

అ. సనకాది యోగిబృంద వంద్యపాద
సాకేతవాస సద్భక్తపోష ॥నె॥

చ. తల్లి దండ్రి గురు దైవము నీవని
తలచుగాను నిన్ను నమ్మియున్న నే
దల్లడిల్లుచుండ దరిచూపవేమి
త్యాగరాజ పరిపాల సుగుణశీల ॥నె॥

## 30

సురటి రాగము — దేశాది తాళము

ప గీతార్థము సంగీతానందము
నీ తావున జూడరా ఓ మనసా

అ. సీతాపతి చరణాబ్జము నిడుకొన్న
వాతాత్మజునికి బాగ దెలుసురా

చ. హరి హర భాస్కర కాలాది కర్మము -
లను మతముల మర్మముల నెఱింగిన
హరి వరరూపుడు హరహాయ వినుతుడు
వర త్యాగరాజ వరదుడు సుఖిరా

## 31

కలావతి రాగము — ఆది తాళము

ప. ఒకసారి జూడగరాదా ?

అ. శుకమానసార్చితపాద ! సదా -
శుద్ధాంతరంగ ! ముదంబుతో

చ. వరులైన దిగీశులు చంద్రవిభా -
కర మౌనివరాదులు శ్రీరామ నీ
కరుణాకటాక్షముచేత వెల
సిరే గాని త్యాగరాజసన్నుత

## 32

భైరవి రాగము — ఆది తాళము

ప. రామ కోదండరామ
రామ కల్యాణరామ ॥రా॥

చ. రామ సీతాపతి రామ నీవేగతి
రామ నీకుమ్రొక్కితి రామ నీచేజిక్కితి ॥రా॥
రామ నీకెవరు జోడు రామ క్రీగంట జూడు
రామ నేను నీవాడ రామ నాతో మాటాడు ॥రా॥
రామనామమే మేలు రామచింతనే చాలు
రామ నీవు నన్నేలు రామ రాయడే చాలు ॥రా॥
రామ నీకొకమాట రామ నాకొకమూట
రామ నీపాటేపాటు రామ నీబాటేబాటు ॥రా॥
రామ నేనెందైనను రామ వేరెంచలేను
రామ యెన్నడైనను రామ బాయగలేను ॥రా॥
రామ విరాజరాజ రామ ముఖజితరాజ
రామ భక్తసమాజ రక్షిత త్యాగరాజ ॥రా॥

## 33

బిలహరి రాగము — ఝంప తాళము

ప. తొలిజన్మమున జేయు
డుడుకు దెలిసెను రామ ॥తొ॥

అ. ఫలమేమో యరచేతి
పుంటి కద్దమువలెనా ॥తొ॥

చ. రాగిపైరులచెంత రమ్యమౌ వరిమొలక
రాజిల్ల నేర్చునటరా ?
నాగశయన ! త్యాగరాజు పాపముతోను
నామ పుణ్యము చెలగునా ? నేను ||తొ||

## 34

శహాన రాగము — రూపక తాళము

ప. ఏ మానతిచ్చేవో ఏ మెంచినావో ||ఏ||

అ. నా మాటలు వినవో రామ నా తలవ్రాలేమో ||ఏ||

చ. యశమాయువు సద్భక్తియు ఏకాంత చిత్తము
సుశరీర మొసంగే భాసుర త్యాగరాజనుత ||ఏ||

## 35

రీతి గౌళ రాగము — దేశాది తాళము

ప. చేరరా వదేమిరా ? రామయ్య ||చే||

అ. మేరగాదురా యిక మహా
మేరుధీర ! శ్రీకర ! ||చే||

చ. తల్లిదండ్రి లేని బాల తన నాథు గోరు రీతి
పలుమారు వేడుకొంటే పాలించరాదా ?
వలచుచు నేను నీదు వదనారవిందమును
దలచి కరగగ జూచి త్యాగరాజసన్నుత ||చే||

# ౩6

కళ్యాణి రాగము — ఆది తాళము

ప. ఎందుకో నీ మనసు కరగదు?
యేమి నేరమో తెలియ ॥ఎం॥

అ. ఎందు జూచినగాని దశరథ
నందనుగా భావించిన నాపై ॥ఎం॥

చ. సుముఖులైన యీ లోకులు నన్ను_
సూయలచే జూచెదరు
విముఖులై యెంతటి వాడని బహు_
విధముల దూరెదరు;
సముఖమునకు యోగ్యుడు గా_
డని మఱి జూడగ నెంచెదరు;
గమకమునను రక్షించెడివారలు
గారని నిన్నే కోరిన నాపై ॥ఎం॥
ధన తనయ కళత్రాదుల జూచి
తమదని భ్రమసెదరు;
వెనుక ముందు తెలియని యా
ధనికుల వెంబడి తిరిగెదరు;
ఇనకుల జలనిధిసోమ రామ న_
న్నిటుల సేయక నీ వెయ్యారు

మనవులడుగు నాపైని కరుణతో
మన్నించి కాపాడుము రామ ||ఎం||
రాగరహిత! శ్రీరామ ఇంత ప-
రాకు జేయక శర-
ణాగతవత్సల! నమ్మితి తారక
నామ! పరాత్పర!
త్యాగరాజహృదయ సదనుడని య-
త్యంతము వేడితిరా; నీ
వే గతియనుచు రేయుబగలు వే-
యివేల మొరలు బెట్టిన నా పై ||ఎం||

37

దర్బారు రాగము — ఝంప తాళము

ప. అపరాధముల మాన్పి ఆదుకోవయ్య ||అ||
అ. కృపజూచి బ్రోచితే కీర్తి కలదిక నీకు ||అ||
చ. అత్యంత మత్సరమదాంధుడై సజ్జనుల
నిత్యకర్మములవలె నిందించుకొన్న నా ||అ||
చూచువారల కెదుట సాక్షి జపితుడనైతి
యోచించ నీపాదయుగళ ధ్యానములేని నా ||అ||
స్త్రైణజనులనుగూడి వీణాదితీనిగాని
ప్రాణహితగుణకథల బల్కలేనైతి నా ||అ||

శరణుజొచ్చిన నన్ను కరుణించవే రామ
వర త్యాగరాజనుత వశముగాదిక నాకు ॥అ॥

## 38

అసావేరి రాగము — ఆది తాళము

ప. దశరథనందన దానవమర్దన
దయయా మాం పాహి ॥ద॥

చ. చాలును మాయాజాలము చేయ
జాలను తోయజాలయా రాయ ॥ద॥
మనసున నారీమణులను గోరి
జనులతో జేరి జెప్ప నీదారి ॥ద॥
ధనికుని నెంచి తనువును బెంచి
వనితల గాంచి వదరుదు పొంచి ॥ద॥
నే పరదేసి నేర్పున గాసి
బాపవే డాసి పావను జేసి ॥ద॥
సర్వము నీవు సారెకు రావు
గర్వములు లేవు గ్రక్కున బ్రోవు ॥ద॥
వలచితి నీలవర్ణ సుశీల
చలమిక నేల ? స్వామి నే తాళ ॥ద॥
సాగరశయన సారసనయన
త్యాగరాజావన తారకసుగుణ ॥ద॥

## 39

అభోగి రాగము — దేశాది తాళము

ప. నన్ను బ్రోవ నీ కింత తామసమా ?
నాపై నేరమేమి బల్కుమా ॥న॥

అ. చిన్ననాడే నీచెలిమి గలుగ గోరి
చింతించలేదా శ్రీరామ ॥న॥

చ. నిజదాసవరులగు తమ్ములతో
నీవు బాగ బుట్టగలేదా ?
గజరాజరక్షక తనయులను
గని పెంచలేదా త్యాగరాజనుత ॥న॥

## 40

శంకరాభరణ రాగము — ఆది తాళము

ప. ఏమి నేరము నన్ను బ్రోవ ?
ఎంత భారము నావల్ల ॥ఏ॥

అ. సామజరాజ వరదుడని మునుల
సత్కీర్తి గల్గలేదా ? నాపై ॥ఏ॥

చ. దీనబంధువని దేవదేవు డస -
మాన ఘనుడని ధర్మాత్ము డనుచును
జ్ఞానఘనులు గుణగానముసేయ బి -
రాన జూడవు త్యాగరాజార్చిత నాపై ॥ఏ॥

## 41

బేగడ రాగము — దేశాది తాళము

ప. తనవారి తనము లేదా ?
తారకాధిపానన ! వాదా ? ॥త॥

అ. ఇనవంశరాజుల కీగుణము లెన్నడైనగలదా? నాదుపై॥త॥

చ. పేరపేర బిలిచి హారములు ప్రేమ -
మీర మీరొసగలేదా ? నాదుపై ॥త॥
అలనాడు యన్నమారగించు వేళ
బలువానరుల పంక్తి నుంచలేదా ? ॥త॥
రామ ! రామ ! రామ ! రచ్చసేయక లే
తామసంబు ఏల ? త్యాగరాజనుత ॥త॥

## 42

హుసేని రాగము — రూపక తాళము

ప రామ రామ రామ సీతారమణ పాపహరణ ॥రా॥

చ. చెంత రాకయుండు టెవరి చెలిమో నిండు కలిమో ॥రా॥
మనమేచేమనుచు యింత మదమా కామదమా ॥రా॥
సనువినా గతి యెవ్వరనుచు నగవో లేక బిగువో ॥రా॥
శశిముఖ నన్నేచేది యశమా నాదు వశమా ॥రా॥
కరుణజూతు ననుచు బలుకు కరవా బ్రోవ బరువా ॥రా॥
రామాయని మొఱలిడ మది-రాయా దేవరాయ ॥రా॥

ఇన్ని విన్నపములకు మది_యినుమా
మాటవినుమా ||రా||
లేమిదెల్ప పెద్దలెవరు లేరో ? నీదు పోరో ||రా||
ఉండినను నిన్నుబోలి_యుందురే ఆడుకొందురే ||రా||
భళి భళి తనకర్మమెంత_బలమో లేక చలమో ||రా||
వలచి పాడి యింత బల్కు_వలెనా తాళగలనా ||రా||
ఇల రక్షణ సేయలేని కులమా వ్యాకులమా ||రా||
వశముగాదు త్యాగరాజవరద కుందసురద ||రా||

## 43

కాపి రాగము — ఆది తాళము

ప. అన్యాయము సేయకురా రామ న
న్నన్యునిగ జూడకురా ; నాయెడ రామా ||అ||

అ. ఎన్నో తప్పులు గలవారిని రా_
జన్య నీవు బ్రోచినావు గనుకను ||అ||

చ. జడభరతుడు జింకశిశువు నెత్తి
బడలిక దీర్చగ లేదా ?
కడలిన మునిగిన గిరి నొక కూర్మము
గాపాడగ లేదా ?
పుడమిని పాండవద్రోహిని ధర్మ
పుత్రుడు బ్రోవగ లేదా ?
నడిమి ప్రాయమున త్యాగరాజనుత
నా పూర్వజు బాధ దీర్పలేదని ||అ||

## 44

కిరణావళి రాగము — దేశాది తాళము

ప. పరాకు నీ కేలరా రామ ! ॥ప॥

అ. చరాచరముల వసియించే యో
సారసాక్షా ! నా పనులంతే యీ ॥ప॥

చ. పురాణ శబరి యొసంగిన యటు నే
భుజించుకొన్న శేషమా రామ !
ధరాతలమున గుహునివలె పత్ర-
తల్పమొనర్చితినా ? శ్రీ త్యాగరాజుపై ॥ప॥

## 45

జనరంజనీ రాగము — చాపు తాళము

ప. నా డాడిన మాట నేడు తప్పవలదు
నా తండ్రి ! శ్రీరామ ॥నా॥

అ. ఏడాదినాడుగ ఎడబాయనివాని
పోడిమిగ గాపాడుదునని చిన్న ॥నా॥

చ. తలకు వచ్చిన బాధ తలపోగకు సేతు
వలచి నమ్మిన వాని వలలోన దగులుదు
ఇల భక్తిసాగర మీదజేతునని
తలబోసి బల్కితివే త్యాగరాజార్చిత ॥నా॥

## 46

దేశ్యతోడి రాగము — ఝంప రాగము

ప. నే పొగడకుంటే నీకేమి కొదవో ?
నీ మనసు దెలిసె గదరా ఓ రామ ॥నే॥

అ. ప్రాపుగల శుక సనక ప్రహ్లాద నారద
పరమేశ రుద్రాది భక్తు లర్చింపగ ॥నే॥

చ. భుజియింప బెట్టు సతి, బుధులు సామాజికులు
భజియింప సోదరులు పవనసూను-
డజ బిడౌజాది సురలాప్తులైనారు ; నీ
రజనయన శ్రీ త్యాగరాజనుత ! బాలుడగు ॥నే॥

## 47

మోహన రాగము — చాపు తాళము

ప. మాటి మాటికి దెల్పవలెనా ? ముని
మానసార్చితచరణ రామయ్య నీతో ॥మా॥

అ. నూటి కొక్కటే మాట చాలదా ?
నాటి మొదలుకొని సాటిలేని నీతో ॥మా॥

చ. పంకజవదనా సరసవినోద !
సంకటములను వేగమే దీర్పరాదా ?
శంకరప్రియ సర్వాంతర్యామి గాదా ?
ఇంక నామది నీకు తెలియగలేదా ?

కరుణాసాగర పరిపూర్ణ నీకు
సరి వేల్పులు లేరనుచు నీవరకు
మొరబెట్టిన నాపై యేల పరాకు
వరులు జూతురు భాండమున కొక్క మెతుకు ॥మా॥
శృంగారశేఖర! సురవైరి రాజ
భంగ సుజనహృత్కుముద రాజ!
మంగళకరరూప! జితరతిరాజ !
గంగాజనక పాలిత త్యాగరాజ ॥మా॥

## 48

మనోహరీ రాగము — రూపక తాళము

ప. పరితాపము గని యాడిన -
ఆ పలుకుల మరచితివో ॥నా॥

అ. సరిలేని సీతతో సరయూమధ్యంబున నా ॥ప॥

చ. పరమగు బంగారువోడను మెరయుచు పదిపూటలపై
కరుణించెద ననుచు గ్రేగనులను త్యాగరాజుని ॥ప॥

## 49

పంతురావళి రాగము — రూపక తాళము

ప. నిన్నే నెఱనమ్మినానురా ;
ఓ రామా రామయ్య ॥ని॥

అ. అన్ని కల్లలనుచు నాడి పాడి వేడి
పన్నగశయన! నే చిన్నతనమునాడే

చ. వేదశాస్త్ర పురాణ విద్యలచే భేద
వాదములు దీరక భ్రమసేవారల జూచి ॥ని॥
భోగముల కొఱకు భువిలో రాజసమున
యాగాదు లొనరించి యలయువారల జూచి ॥ని॥
ఈ జన్మమున నిన్ను రాజిజేసికోలేక
రాజిల్లరని త్యాగరాజవంద్య రాఘవ ॥ని॥

## 50

సావేరి రాగము — దేశాది తాళము

ప. దరిదాపు లేక వేడితే
దయ రాదేమో శ్రీరామ ॥ద॥

అ. కరి ధనములు గలిగితే
కరుణించి బ్రోతువేమో ॥ద॥

చ. అలనాడు నిర్జరవైరి బా
లుని జూచి బ్రోచితివిగాని
వలచి పదముల నమ్మితే
వర మీ దోచెనా ? త్యాగరాజు ॥ద॥

## 51

సురటి రాగము — దేశాది తాళము

ప. రామచంద్ర నీదయ
రామ యేల రాదయ ॥రా॥

అ. కామకోటి సుందరా! కరధృతమందర!
ప్రేమమీర ముందర బిలువరాక యుందురా? ॥రా॥

చ. కాననంబు తాపమో కైకమీది కోపమో?
నేను సేయు పాపమో నీకు శక్తి లోపమో? ॥రా॥
ఆడదన్న మోసమో అలనాడుపాసమో
మేడలేని వాసమో మేము సేయు ద్రోసమో ॥రా॥
కల్లలైన నేయమా? కంటె నీకు హేయమా?
తల్లడిల్ల న్యాయమా? త్యాగరాజ గేయమా ॥రా॥

## 52

గానవారిధి రాగము — ఆది తాళము

ప. దయజూచుట కిది వేళరా; దాశరథి ॥ద॥

అ. భయవారణ మృగేశ జలజో
ద్భవార్తిహర! మంజులాకార నను ॥ద॥

చ. మును నీ వానతిచ్చిన
పను లానగొని నే_
మనసారగ నిదానముగ స_
ల్పినాను వరత్యాగరాజాప్త నను ॥ద॥

## 53

హరికాంభోజి రాగము — రూపక తాళము

ప రామ నన్ను బ్రోవ రా _ వేమొకో లోకాభి ॥రా॥

అ. చీమలో బ్రహ్మలో శివకేశవాదులలో
ప్రేమమీర మెలగుచుండే బిరుదువహించిన సీతా ॥రా॥

చ. మెప్పులకై కన్నతావు నప్పుబడక విఱ్ఱవీగి
తప్పుపనులు లేకయుండే త్యాగరాజవినుత సీతా ॥రా॥

## 54

కేదారగౌళ రాగము — ఆది తాళము

ప. తులసీ బిల్వ మల్లికాది జలజ సుమ పూజల
గైకొనవే ॥తు॥

అ. జలజాసన సనకాది కరార్చిత !
జలదాభ ! సునాభ ! విభాకర హృ-
జ్జలేశ హరిణాంక సుగంధ ॥తు॥

చ. ఉరమున ముఖమున శిరమున భుజమున
కరమున నేత్రమున చరణయుగంబున
కరుణతో నెనరుతో పరమానందముతో
నిరతమును శ్రీ త్యాగరాజు నిరుపాధికుడై
యర్చించు ॥తు॥

## 5 5

మాయామాళవగౌళ రాగము — రూపక తాళము

ప. తులసీదళములచే సంతోషముగా బూజింతు ॥తు॥

అ. పలుమారు చిరకాలము పరమాత్ముని పాదములను ॥తు॥

చ. సరసీరుహ పున్నాగ చంపక పాటల కురువక
కరవీర మల్లికా సుగంధరాజ సుమముల్
ధర నివి యొకపర్యాయము ధరాత్ముని సాకేత-
పురవాసుని శ్రీరాముని వరత్యాగరాజనుతుని ॥తు॥

## 5 6

దేవగాంధారి రాగము — ఆది తాళము

ప. శ్రీ తులశమ్మ ! మాయింట నెలకొనవమ్మ
ఈ మహిని నీ సమాన మెవరమ్మ? బంగారు బొమ్మ ॥శ్రీ॥

చ. కరకు సువర్ణపు సొమ్ములు బెట్టి
సరిగె చీర ముద్దుగురియగ గట్టి
కరుణజూచి సిరులను యొడిగట్టి
వరదుని కరమునను బట్టి ॥శ్రీ॥

ఉరమున ముత్యపుసరు లసియాడ
సురతరణులు నిన్నుగని కొనియాడ
వరమును లష్టదిగీశులు వేడ
వరదుడు నిను ప్రేమ జూడ ॥శ్రీ॥

మరువక పారిజాత సరోజ
కురువక వకుళ సుగంధరాజ_
వరసుమములచే త్యాగరాజ_
వరద! నిను పూజసేతు ॥శ్రీ॥

## 5 7

హరికాంభోజి రాగము — ఆది తాళము

ప. లాలి లాలీ యని యూచేరా వన_
మాలి మాలిమితో జూచేరా ॥రా॥

చ. దేవ దేవ యని బిలిచేరా మహాను_
భావ భావమున దలచేరా ॥లా॥
రామ రామ యని బలికేరా ని_
ష్కామ కామరిపునుత రారా ॥లా॥
కోరి కోరి నిను కొలిచేరా మాయ_
దారి దారి సద్భజనరా ॥లా॥
రాజ రాజ యని పొగడేరా త్యాగ_
రాజ రాజయని మ్రొక్కేరా ॥లా॥

## 5 8

నీలాంబరి రాగము — రూపక తాళము

ప. లాలి యూగవే మా_ పాలి దైవమా ॥లా॥
అ. లాలి యూగవే నను_గాలి దిండు పాన్పుపైని ॥లా॥

చ. సమ్మిన వేడుక మీర తమ్ములతోను
కమ్మని విడ మొసగు యా జనకాత్మజతోను ॥లా॥
బొమ్మదేవర తండ్రి భూమీశులతోడను
సమ్మతమున త్యాగరాజు సన్నుతి సేయగ ॥లా॥

## 5 9

పున్నాగవరాళి రాగము — ఆది తాళము

ప. తవదాసోహం తవదాసోహం తవదాసోహం
దాశరథే ॥త॥

చ. వరమృదుభాష విరహితదోష
నరవరవేష దాశరథే ॥త॥
సరసిజనేత్ర పరమపవిత్ర
సురపతిమిత్ర దాశరథే ॥త॥
నిన్ను కోరితిరా నిరుపమశూర
నన్నేలుకోరా దాశరథే ॥త॥
ఘనసమనీల మునిజనతాల
కనకదుకూల దాశరథే ॥త॥
మనవిని వినుమా మరవసమయమా
ఇనకులధనమా దాశరథే ॥త॥
ధర నీవంటి దైవము లేదంటి
శరణనుకొంటి దాశరథే ॥త॥
ఆగమవినుత రాగవిరహిత
త్యాగరాజనుత దాశరథే ॥త॥

## 60

హంసధ్వని రాగము — దేశాది తాళము

ప. రఘునాయక ! నీపాదయుగ
రాజీవముల నే విడజాల ; శ్రీ ॥ర॥

అ. అఘజాలముల బారద్రోలి న-
న్నాదరింప నీవే గతిగాద ? శ్రీ ॥ర॥

చ భవసాగరము దాటలేక నే
బలుగాసిబడి నీ మరుగు జేరితిని
అవనిజాధిప్రాశ్రితరక్షక
ఆనందకర ! శ్రీ త్యాగరాజనుత ॥ర॥

## 61

హుసేని రాగము — ఆది తాళము

ప. ఏమని వేగింతునే శ్రీరామరామ ॥ఏ॥

అ. ఏమని వేగింతు నెంతని సైరింతు
నా ముద్దుదేవుడు నను బాసె నయ్యయ్యో ॥ఏ॥

చ. పాలించి లాలించి పలుమారు గౌగిలించి
తేలించి నను పరదేశి సేయ దోచెనో ॥ఏ॥
ఆడిన ముచ్చట నాదంతరంగము నిండ
నీడు లేదని యుంటి నిందాక సరివారిలో ॥ఏ॥
ఎడబాయక త్యాగరాజు నేలు శ్రీహరిని తొల్లి
బడలిక లార్చి నా చెయిబట్టినది తలచుచు ॥ఏ॥

## 62

### రామమనోహరి రాగము — ఆది తాళము

ప. సీతామనోహర ! శృంగారశేఖర ! ॥సీ॥

అ. వాతాశనారివరవాహన ! వారిజాసనాది
వందితపద ॥సీ॥

చ. తొలిజన్మములను జేసిన పూజా-
ఫలమో ? లేక నీదు కటాక్ష-
బలమో ? నీవాడను నే నని లోకులు
బల్కగా ధన్యుడనైతిని ॥సీ॥
దీనలోకసంరక్షక దైవా-
ధీనముగా నీరూపము నాదు
మానసాబ్జమున నాటియుండగ నే
నెంతటి భాగ్యశాలినో ॥సీ॥
దిట్టతనమునను భక్తి స్థిరమౌ-
నట్టుగా శ్రీరామ యెన్నటికి
గట్టిగాను త్యాగరాజుని చేయి
బట్టి రక్షించి మేలుకోవయ్యా ॥సీ॥

## 63

### బలహంస రాగము — ఆది తాళము

ప. నిన్నుబాసి యెటులుందురో ! నిర్మలాత్ములౌ
జనులు ॥ని॥

అ. అనఘ! సుపుణ్య అమరవరేణ్య!
సనకశరణ్య! సత్కారుణ్య! ||ని||

చ. కనులకు చలువ చెవుల కమృతము
విను రసనకు రుచి మనసుకు సుఖము
తనువుకు యానందము గల్గజేసే
త్యాగరాజహృద్ధామ! పూర్ణకామ! ||ని||

## 64

అఠాణ రాగము — ఆది తాళము

ప. రారా రఘువీర వెంట రారా తోడు ||రా||

చ. అనుదినమును నిను మనసున కనుగొని
ఆనందమాయె దయాళో ||రా||
సకల సుజనుల గొలుచు సన్నిధి గని
చల్లనాయె దయాళో ||రా||
పలువిధ చెడు దుర్విషయచయము లెడ_
బాయ నాయె దయాళో ||రా||
తొడరి యడుగ కిది బుద్ధి సం_
తోసమాయె దయాళో ||రా||
సుముఖమునను తిలకము చెలగగ గని
సౌఖ్యనాయె దయాళో ||రా||
కవగొని భవమున పొరలక నీ దే
కార్యమాయె దయాళో ||రా||

దశరథతనయ ! శుభచరిత పాలిత
త్యాగరాజ దయాళో ॥రా॥

## 65

**వసంత రాగము — ఆది తాళము**

ప. ఎట్లా దొరికితివో ? రామ తన ॥కె॥
అ. చుట్లారగడియ దోవకు నాదు
పట్టాభిమానము లేకుండగ ॥ఎ॥
చ. పాద మహిమో పెద్ద లాశీర్వాద బలమో, సుస్వరపు
నాదఫలమో త్యాగరాజఖేదహర శ్రీనాథ తన ॥కె॥

## 66

**మోహన రాగము — ఆది తాళము**

ప. రామా నిను నమ్మినవారము
గామా సకలలోకాభి ॥రా॥
అ. పామరజనదూర వరగుణఘృణా-
పాంగ శుభాంగ మునిహృదబ్జభృంగ ॥రా॥
చ. వాలాయముగాను రాను జా-
గేల సుగుణ శ్రీదశరథ నృ-
పాల హృదయానందకర ! శ్రీ
లోల పాల వెలయు మిక
ఫాలలోచన హృద
యాల 'యాప్తజనపాల కనకమయ-

చేల యిక పరాకేల యిపుడు మ_
మ్మేల నీదుమన సేల రాదు ॥రా॥
నీవే గతియంటిని గాని
నే వే ఱేఖి యెరుగను ముందర
రావే నీ పదపంకజభక్తి
నీవే భావజారినుత
దేవ నీదు పదసేవాఫలము మము
గావునే పతిత_
పావన త్రిదశనాథనీయ ముని_
జీవనానిశము బ్రోవవేల శ్రీరామ ॥రా॥
ధారాధరనిభదేహ జనా_
ధారా దురితౌఘ జలద ప_
మీరా త్యాగరాజహృదయా_
గార ! సారహీన సం_
సారమందు వేసారి నిన్ను మన_
సార నమ్మికొన నేరలేని నే_
నూరక యిక విచారమందుటకు
మేరగాదు శ్రీరామ ॥రా॥

## 67

హరికాంభోజి రాగము — దేశాది తాళము

ఎంత రానీ తనకెంత పోనీ నీ
చెంత విడువజాల శ్రీరామ ॥ఎం॥

అంతకారి నీ చెంతజేరి, హనుమంతుడై
కొలువలేదా ॥ఎం॥

శేషుడు శివునికి భూషుడు లక్ష్మణ
వేషియై వెలయలేదా ॥ఎం॥

శిష్టుడు మౌనివరిష్టుడు గొప్ప వ
సిష్ఠుడు హితుడు గాలేదా ॥ఎం॥

నరవర నీకై సురగణమును దా
నములై కొలువలేదా ॥ఎం॥

ఆగమోక్తమగు నీ గుణములః శ్రీ
శ్రీత్యాగరాజు బాడగలేదా ॥ఎం॥

## 68

శ్రీమణి రాగము — ఆది తాళము

ఏమందునే విచిత్రమును, ఇలలోన మనుజులాడే ॥దే॥

నీ మంత్రమహిమ నెరుగలేక
సామాన్యులై బల్కేరు నీతో ॥ఏ॥

తామసంబుచేత తత్త్వము బలుకుచు
కామదాసులై కరుణమాలి మదిని
భూమి సంచరించి పొట్ట నింపుచును
తామె పెద్దలట త్యాగరాజనుత ॥ఏ॥

## 69

### వాచస్పతి రాగము — దేశాది తాళము

కంటజూడుమీ ఒకపారి క్రీ ॥కం॥

బంటుడై వెలయు బాగుగాని తప్పు
తంటలెల్ల మానుకొన్న నన్ను క్రీ ॥కం॥

అలనాడు సౌమిత్రి పాదసేవ
చెలరేగి సేయువేళ సీతతో
పలికి చూచి నంత పులకాంకితుడై
పరగినయటు త్యాగరాజుని క్రీ ॥కం॥

## 70

### శహన రాగము — ఆది తాళము

గిరిపై నెలకొన్న రాముని
గురితప్పక గంటి భద్ర ॥గిరి॥

పరివారులు విరి సురటులచే నిల-
బడి విసరుచు కొసరుచు సేవింపగ ॥గిరి॥

పులకాంకితుడై యానందాశ్రు-
వుల నింపుచు మాటలాడవలెనని
కలువరించగ గని పదిపూట లంపై
గాచెద నను త్యాగరాజ వినుతుని ॥గిరి

## 71

**దేశికతోడి (వరాళి) రాగము — ఝంపె తాళము**

నే పొగడకుంటే నీ కేమి కొదవో
నీ మనసు తెలిసెగదరా ఓరామ ॥నే॥

ప్రాపుగల శుక సనక ప్రహ్లాద నారద
పరమేశ రుద్రాది భక్తు లర్చింపగ ॥నే॥

భుజియింప బెట్టు సతి బుధులు సామాజికులు
భజియింప సోదరులు పవనసూను
డజ బిడౌజాది సురలాప్తులైనారు నీ-
రజనయన శ్రీ త్యాగరాజనుత బాలుడగు ॥నే॥

## 72

**శుద్ధసావేరి రాగము — దేశాది తాళము**

రఘునందన ర్రాజమోహన!
రమియింపవె నా మనసున ॥ర॥

నగజానిలజ నారదాది హృ-
న్నాళీక నివాసుడైనగాని శ్రీ ॥ర॥

చిత్తమందు నిన్నుంచి ప్రేమతో
జింతించు సద్భక్తుల
నుత్తమోత్తములంచు నామది
నుంచి పూజించలేదా
తత్తరంబు దీర్ప కారణంబు నీవే
తాళజాల నిక త్యాగరాజనుత ॥ర॥

## 73

రీతిగౌళ రాగము — రూపక తాళము

రాగరత్న మాలికచే
రంజిల్లునట హరిశత ||రా||
బాగ సేవించి సకల
భాగ్య మందుదాము రారే ||రా||
నైగమషట్ఛాస్త్ర పురా_
ణాగమార్థ సహితమట
యోగివరులు ఆనందము నొందే సన్మార్గమట
భాగవతోత్తములు కూడి పాడే కీర్తనములట
త్యాగరాజు కడతేర తారకమని చేసిన శత ||రా||

## 74

ఘూర్జరి రాగము — ఆది తాళము

వరా లందుకొమ్మని నాయందు
వంచన సేయుట న్యాయమా ||వరా||
సురాసురవినుత రామ నామన_
సు భక్తినే కోరియుండగ నను ||వరా||
మనసున నిజముగ నమ్మిన వారి
మనసు కొంచ ఫలమాసించరా_
దనుచు ఘనుని జేసిన నీ బిరుదుకు
కనక కశిపు సుతుడు సాక్షిగాదా ||వ||

అవివేకముతో తెలిసి తెలియకను
భరసుఖముల కాసించినగాని
ధ్రువమైన ఫలమొసగు నీ శక్తికి
ధ్రువుడు సాక్షిగాదా రామ నను ॥వ॥
చరాచరాత్మక సురపూజిత ఇక
పరాకు లేకను సతతము నీ ద_
య రావలె ననుచు కోరిన శ్రీత్యా_
గరాజునిపై కృపలేక నను ॥వ॥

## 75

కల్యాణి రాగము — ఆది తాళము

శివే పాహిమా మంబికే
శ్రితఫలదాయకి ॥శి॥

కవేరజోత్తరతీరవాసిని
కాత్యాయని ధర్మసంవర్ధని ॥శి॥

స్వభావమో నీ ప్రభావము మహా_
నుభావులైన భారతికి బొగ_
డ భారమైయుండ భావజారా_
తిభామ! నేనెంత భాగ్యదాయకి ॥శి॥

కమలార్ధమిది శశికలాధరీ సుప_
వలారి మాయావిలాసినీ స_

కలాగమనుతే భలారి యన శుభ_
ఫలా లొసగు పరమ లాలనమ్మున ॥శి॥
చరాచరమయీా కరారవిందము_
న రామచిలుకను బిరాన బూని
పరాకుగా జూడరాదు శ్రీరఘు
వరాప్తుడగు త్యాగరాజవినుతే ॥శివే॥

## 7 6

అఠాణ రాగము — ఆది తాళము

శ్రీపప్రియ సంగీతోపాసన చేయవే ఓ మనసా ! ॥శ్రీ॥
తాపసజన మానసధనమా త్రి
తాపరహిత ! సప్తస్వరచారి ॥శ్రీ॥
రంజింప జేసెడు రాగంబులు
మంజుళమగు నవతారము లెత్తి
మంజీరము ఘల్లని నటించు
మహిమ దెలియు త్యాగరాజనుతుడగు ॥శ్రీ॥

## 7 7

భిన్నషడ్జమ రాగము — దేశాది తాళము

సరివారిలోన చౌక చాలదాయెనా ॥స॥
పొరుగిండ్ల వారల చేతి
పూజ జూచి చల్లనాయెనా ॥స॥

తారుమారుగా బల్కువారలు
తత్తరించగా జూడ న్యాయమా
పారమార్థికుల దుఃఖజాలముల
బాపలేదా శ్రీ త్యాగరాజనుత ॥సరి॥

78

**పంతువరాళి రాగము — ఆది తాళము**

సుందరతరదేహం వందేహం రామం ॥సుం॥
కుందరదన మాప్తకుముదశశాంకం
కందర్పశతకోటికాంతి మతినిష్కళంకం ॥సుం॥
పతితజనపావనం పరిపాలిత భువనం
శ్రుతినికరసదనం శుభకర వదనం
యతివరజీవనం ఇభరాజపాలనం
దితిజమదదమనం దీనజనావనం ॥సుం॥
నవదూర్వదళనీలం నందితామరజాలం
అవనతసురపాలం అద్భుత లీలం
భవభయహరణకాలం భక్తజనవత్సలం
శివ మద్వైత మమలం శ్రీమ త్కనకాభచేలం ॥సుం॥
ఆగమసంచారం అఖిలలోకాధారం
వాగధిపకుమారం వరవీరధీరం
రాగాదిసంహారం రాఘవ ముదారం
త్యాగరాజహృత్సంచారం కారుణ్యపారావారం ॥సుం॥

## 79

శంకరాభరణ రాగము — దేశాది తాళము

ఎందుకు పెద్దలవలె బుద్ధియవు
ఎందు పోదునయ్య రామయ్య ॥ఎం॥

అందరివలె దాటి దాటి వదరితి
అందరాని పండాయె గదరా ॥ఎం॥

వేదశాస్త్ర తత్వార్థములు తెలిసి
భేదరహిత వేదాంతములు తెలిసి
నాదవిద్య మర్మంబులను దెలిసి
నాథ త్యాగరాజనుత నిజముగ ॥ఎం॥

## 80

ఖరహరప్రియ రాగము — ఆది తాళము

విడము సేయవే నన్ను
విడనాడకవే ॥వి॥

పుడమితనయ చేతి మంచి
మడుపులనుచు దలచి తలచి ॥వి॥

రాజమాన్యుడౌ సౌమిత్రి
రతనతమ్మపడిగ బట్టి
తేజరిల్ల నిలచినాడు దేవ దేవ!
జాజికాయలు ఏలకులు
జాపత్రి వక్కలాకులు

రాజరాజవర త్యాగ
రాజు ప్రేమతో నొసంగే ॥విడ॥

## 81

**కల్యాణి రాగము — జంపె తాళము**

అమ్మ రానమ్మ తులసమ్మ నను పాలింప
వమ్మ సతతము పదములే నమ్మినానమ్మ ॥అ॥

నెమ్మదిని నీ విహపరమ్ము లొసగుదు వనుచు
కమ్మవిల్తుని తండ్రి కలనైన బాయడటు ॥అ॥

నీ మృదుతనువును గని నీ పరిమళమును గని
నీ మహాత్మ్యమును గని నీరజాక్షి
తామరసదళనేత్రుడు త్యాగరాజుని మిత్రుడు
ప్రేమతో శిరమునను బెట్టుకొన్నాడటు ॥అ॥

## 82

**శంకరాభరణ రాగము — ఆది తాళము**

ఎదుట నిలిచితే నీదుసొమ్ము
లేమి బోవురా
నుదుటి వ్రాతగాని మట్టుమీరను నా ॥ఎ॥

తరము తెలిసి మోసము పోదునా
సరాసరిగ జూతురా నాదు యవ_
సరాల తెలియుము వరాలడుగ జా_

లరా సకలదేవరాయ మనవి వి_
నరఅఘహర !సుందరాకార ! నా ॥ఏ॥
విదేహజారమణ ! దేవ ! బ్రోవగ
నిదే సమయ మన్యదేవతల వే
డదే మనసు తెలియదేమి రాఘవ !
ఇదేటి శౌర్యము పదేపదే నా
తరాన దొరకని వరాకు నా యెడ_
ను రామ ! చేసితే సురానురులు మె_
త్తురా ఇపుడు ఈ హరామితనమే_
లరా భక్త త్యాగరాజనుత నా ॥ఏ॥

## 83

అఠాణ రాగము — త్రిపుట తాళము

ఏ పాపము చేసితిరా రామ నీ ॥నే॥
కేపాటైన దయరాదు నే
నీ పాదములను గన మొరలిడితే ॥నే॥
నీ పాటున విని విననట్లుండుటకు నే
నాదరూపుడవని విని నే శ్రీ_
నాథ నిన్ను నమ్మితిని
నాదాపురమున నుండియు
నన్నాదరించక యూరకుండుటకు నే ॥నే॥
ఎందుకనుచు సైరింతునురా రామ
ముందు వెనుక తోచదురా

ముందర నిలచి బలుకురా నా
యందు నీకు ఈవరకు మఱపురా ॥ఏ॥
గారవింప దయరాదా పాలు_
గారు మోము జూపరాదా
ఊరకుండుట మరియాదా నా
దూరా దెల్పువారెవ్వరు లేరా ॥ఏ॥
కన్నవారిని వేడినానా నా
యన్న నిన్నాడుకొన్నానా
నిన్ను నమ్మినవాడను గానా ముని
సన్నుత కపటములన్ని నాతోనా ॥ఏ॥
వినవయ్య ఇనకులధనమా రామా
నిన్ను నమ్మి ఇంక దురితమా భు
వనమున నీకిది ఘనమా నీ
మనసిటువంటి దనుచును దెలుపుమా ॥ఏ॥
సదయుడై ఇంక పరాకా నా
హృదయవాసుడు నీవేగాక
ఇది బుద్ధియనుచు దెల్పలేక నాడు
మొదలుగాను యూరకున్నావుగాక ॥ఏ॥
రాజశేఖర సన్నుతాంగ త్యాగ_
రాజహృదబ్జ సుభృంగ
రాజిత కరుణాపాంగ రతి_
రాజ జనక పాపధ్వాంత పతంగ ॥ఏ॥

## 84

### తోడి రాగము — చాపు తాళము

ఏమి చేసితే నేమి శ్రీరామ
స్వామి కరుణ లేనివా రిలలో ॥ఏ॥
కామమోహ దాసులై శ్రీరాముని
కట్టు తెలియలేనివా రిలలో ॥ఏ॥
సవము చేసితేనేమి కలిమికి పుత్రో
త్సవము కల్గితేనేమి భువిలో
నన్యబీజ జనితునికొని యేమి
శివకర శ్రీరాముని దయలేని వా ॥ఏ॥
మేడగట్టితేనేమి అందున లాంతర్ జోడుగట్టితేనేమి
చేడియలను మెప్పించ దెలిసితేనేమి
ఈడులేని రాముని దయలేనివా ॥రే॥
ఇమ్ము గలిగితేనేమి, ఇల్లాలికి సొమ్ము బెట్టితేనేమి
కమ్మవిల్తుకేళిని తెలిసి యేమి
తమ్మికంటివాని కరుణలేనివా రిలలో ॥ఏ॥
రాజ్యమేలితే నేమి, బహుజనులలో బూజ్యులైతేనేమి
ఆజ్యప్రవాహముతో నన్నమిడితేనేమి
పూజ్యుడైన రాముని దయలేనివా రిలలో ॥ఏ॥
గురువు తానై ఏమి, కంటికి మేనుగురువై తోచితేనేమి
వరమంత్ర మన్యుల కుపదేశించితేనేమి
వరత్యాగరాజనుతుని దయలేనివా ॥రే॥

## 85

**ఆరభి రాగము — చాపు తాళము**

ఓ రాజీవాక్ష ఓరచూపులు జూచే_
వేరా నే నీకు వేరా ॥ఓ॥

నేరని నాపై నేరము లెంచితే
కారాదని బల్కేవారు లేసి నన్ను ॥ఓ॥

మక్కువతో నిన్ను మ్రొక్కిన జనులకు
దిక్కు నీవై అతిగ్రక్కున బ్రోతువని
ఎక్కువ సుజనులయొక్క మాటలు విని
చక్కని శ్రీరామ దక్కితిగదరా ॥ఓ॥

మితిమేర లేని ప్రకృతిలోన దగిలి నే
మతిహీనుడై సన్నుతి సేయనేరక
బతిమాలి నీవేగతి యని నెర న_
మ్మితి గాని నిను మరచితినా సంతతము ॥ఓ॥

మావర సుగుణ ఉమావరసన్నుత
దేవర దయచేసి బ్రోవగరాదా
పావనభక్త జనావన మహాను_
భావ త్యాగరాజభావిత ఇంక నన్ను ॥ఓ॥

## 86

**నాయకి రాగము — రూపక తాళము**

కనుగొను సౌఖ్యము
కమలజుకైన కల్గునా ॥క॥
దనుజవైరి యగు రాముని
దయగల్గిన యతని వినా ॥క॥
తనువొకచో మనసొకచో
తగినవేన మొకచో నిడి
జనుల నేచువారికి
జయమౌనే త్యాగరాజు ॥క॥

## 87

**కోకిలప్రియ రాగము — దేశాది తాళము**

దాశరథే దయాశరధే ॥దా॥
ఆశర హరణ పరాశరగేయ క_
పీశసుహృదయనివేశ ఘృణాకర ॥దా॥
సరసిజనాభా జలధరశోభా
పరిపాలితేభా వరభక్తలాభా
పరిచరకీశ పాపవినాశ
తరణిసంకాశ త్యాగరాజేశ ॥దా॥

## 88

### శంకరాభరణ రాగము — చాపు తాళము

నన్ను బ్రోవకను విడువనురా రామ! ॥న॥
కానను వెదుకగ గన్న రత్నము రీతి
దోసము తొలగింప దొరకితివిగాని ॥న॥
అంబలి తినువేళ అమృతమబ్బినరీతి
తుంబురు నన్నుత దొరకితివిగాని ॥న॥
చెయ్యవలసిన వేళ తెప్పదొరకినరీతి
అయ్యా నా పాలిటి కమరితివిగాని ॥న॥
ఆడబోయినతీర్థ మెదురైన రీతి
ఈడు జోడు లేని ఇష్టుడవైతివి ॥న॥
సిగ్గుబోవు వేళ చీరలబ్బినరీతి
ఒగ్గి మాయింటికి వచ్చితివిగాని ॥న॥
ఆగమ నిగమ చయార్థము నీవని
త్యాగరాజనుత తలచియున్నాను రామ ॥న॥

## 89

### తోడి రాగము — రూపక తాళము

నినువినా సుఖము గాన నీరజనయన ॥ని॥
మనసుకెంతో ఆనందమై మైపులకరించగా ॥ని॥
రూపము ప్రతాపము శరచాపము సల్లాపముగల ॥ని॥

కరుణారస పరిపూర్ణవరదా మృదువార్తలుకల ॥ని॥
రాగరసిక రాగరహిత త్యాగరాజభాగధేయ ॥ని॥

## 90

**తోడి రాగము — చాపు తాళము**

పొద్దు పొయ్యేని శ్రీరాముని
పూని భజించవే మనసా ॥పొ॥

నిద్దురచేత గొన్నాళ్లు విషయ-
బుద్ధులచేత గొన్నాళ్లు ఓ మనసా ॥పొ॥

పొద్దున లేచి త్రితాపములను నరుల
పొగడి పొగడి కొన్నాళ్లు పట్టి
ఎద్దురీతి కన్నతావున భుజియించి
ఏమి తెలియక కొన్నాళ్లు
ముద్దుగ తోచే భవసాగరమున
మునిగి తేలుచు కొన్నాళ్లు
పద్దుమాలిన పామరజనులతో వెర్రి
పలుకులాడుచు కొన్నాళ్లు ఓ మనసా ॥పొ॥

ముదమున ధన తనయాగారముల జూచి
మదము చేత గొన్నాళ్లు అందు
చెదరిన యంత శోకార్ణవగతుడై
జాలి చెందుటయు కొన్నాళ్లు

ఎదటి వచ్చుజూచి తాళలేక తా
నిలను తిరుగుట కొన్నాళ్లు
ముది మదితప్పిన వృద్ధతనమున
ముందు వెనుక తెలియకనె కొన్నాళ్లు ॥పో॥
యాగాది కర్మములను సేయవలెనని
యలనటుచేత కొన్నాళ్లు అందు
రాగ లోభములతో అపరాధములు చేసి
రాజసమున కొన్నాళ్లు
బాగుగ నామకీర్తనములు సేయుటే
భాగ్యమనక కొన్నాళ్లు
త్యాగరాజనుతుడైన శ్రీరాముని
తత్త్వము తెలియకనే కొన్నాళ్లు ॥పో॥

## 91

చెంచుకాంభోజి రాగము — దేశాది తాళము

వరరాగలయజ్ఞులు తామనుచు
వదరేరయా ॥వ॥
స్వరజాతి మూర్ఛన భేదముల్
స్వాంతమందు తెలియక యుండియు ॥వ॥
దేహోద్భవంబగు నాదముల్
దివ్యమౌ ప్రణవాకారమనే

దాహం బెరుంగని మానవుల్
త్యాగరాజనుత యేచేరు రామ ॥వ॥

## 9 2

కన్నడ రాగము — చాపు తాళము

భజరే భజ మానస రామం ॥భజ॥
అజముఖ శుక వినుతం శుభచరితం ॥భజ॥
నిర్మితలోకం నిర్జితశోకం
పాలితమునిజన మధునా నృపపాకం ॥భజ॥
శంకరమిత్రం శ్యామలగాత్రం
కింకర జనగణ తాపత్రయ తమోమిత్రం ॥భజ॥
భూసమశాంతం భూజాకాంతం వారమఖిలదం
త్యాగరాజ హృద్ధ్వాంతం ॥భజ॥

## 9 3

కాంభోజి రాగము — ఆది తాళము

శ్రీరఘువరాప్రమేయ మామవ ॥శ్రీ॥
శ్రీరఘుకుల జలనిధిసోమ శ్రీరామపాలయ ॥శ్రీ॥
సారసహిత కులాబ్జభృంగ
సంగీతలోల ॥శ్రీ॥
విరోచన కులేశ్వర స్వరలయాది
మూర్ఛనోల్లసిత నారద వినుత ॥శ్రీ॥

శ్రీ భాస్కర కులాద్రి దీప
శ్రీ భాగవత నతచరణ సీ_
తా భాగధేయ త్యాగరాజనుతా_
నిలసుతాప్త సుగుణాభరణ ॥శ్రీ॥

## 94

### జనరంజని రాగము — దేశాది తాళము

స్మరణే సుఖము రామనామ ॥స్మ॥
నరుడై పుట్టినందుకు రామనామ ॥స్మ॥
వరరాజ యోగనిష్ఠులౌ
వారి కానంద మందేటట్టు ॥స్మ॥
రామనామ శ్రవణమువల్ల
నామరూపమే హృదయంబు నిండి ॥స్మ॥
ప్రేమపుట్ట సేయగలేదా ని_
ష్కామ త్యాగరాజు సేయు నామ ॥స్మ॥

## 95

### శంకరాభరణము — ఆది తాళము

రమారమణ రారా ఓ ॥ర॥
సమాన మెవరు వినుమా నా మనవిని
తమాము పొగడ దరమా ఉహిపతికిని ॥ర॥
బుధావ్యవన దశరథార్భక మనో
రథం బొసగు సుమరథార్హ సద్గుణ ॥ర॥

కలార్ధభూష సకలార్ధ శశధర
కలాధరనుత వికలార్తి సంహార ॥ర॥
రణాధిశూర శరణాగతాత్మ చ-
రణంబు భవతారణంబు చేసును ॥ర॥
ముఖాబ్జమును శతముఖారి జూపు స-
ముఖాన గొలుతు దుర్ముఖాసుర హరణ ॥ర॥
ఖిరాన బ్రోవగరాద శ్రీమద-
గరాజధర త్యాగరాజ సన్నుత ॥ర॥

## 96

### బృందావనసారంగ రాగము — ఆది తాళము

కమలాప్తకుల కలశవార్ధిచంద్ర
కావవయ్య నన్ను కరుణాసముద్ర ॥క॥
కమలాకళత్ర కౌసల్యాసుపుత్ర
కమనీయగాత్ర కౌమారిమిత్ర ॥క॥
మును దాసుల బ్రోచినదెల్ల చాల
విని నీచరణాశ్రితుడైతినయ్య
కనికరంబున నా కభయమివ్వుమయ్య
వనజలోచన శ్రీత్యాగరాజవినుత ॥క॥

## 97

### కమలామనోహరి రాగము — ఆది తాళము

నీ ముద్దుమోము జూపవే ॥నీ॥
నా మీద నెనరుంచి, నళినదళనయన ॥నీ॥

ఉరమున నిన్నుంచుకొనే గాని
ఉరగశయన నాదుల్లము రంజిల్ల ॥నీ॥
పులకరించ నిను బూజసేతుగాని
కలనైన మరువ చుక్కలరాయని బోలు ॥నీ॥
మరులుకొన్నాను మదన జనక
ధరసుతారమణ త్యాగరాజునికి ॥నీ॥

## 98

### శంకరాభరణము — ఆది తాళము

రామ సీతారామ రామ_ రామ సీతారామ రామ
రామ సీతారామ రామ_ రామ సీతారామ రామ ॥రా॥
తప్పు లెన్నబోతే మాకు గొప్పతనము రాదు, మా_
యప్ప దయచేసి కండ్లు_ గప్పుకొని పాలింపవే ॥రా॥
దాపులేక నేను నీదు_ ప్రాపు కోరుకొంటిగాని
రేపు మాపనుచు దోవ_ జూపగరాదయ్య బ్రోవ ॥రా॥
నీలవర్ణ పాపముల_ కాలయమైతిని నాదు
జాలి దీర్చి భయము నీ_ కేలయని యాదుకోవే ॥రా॥
వాలాయముగ కృపాల_ వాల రక్షించు కనక
చేల యందరిలో నాదు_చెయి లాగియ్య సమయము ॥రా॥
ఇతరులందు మనసుబోదు_ వెతలు నీకు తెలియరాదు
గతియు ముమ్మాటికి లేదు_క్షితి నెవ్వరిని వేడబోదు ॥రా॥
రామ రామ నిత్యశత్రు _ భీమ భీమనుత గత
కామ కామవైరినుత_ నామ నామదిని రావే ॥రా॥

దేవ దేవార్చిత సర్వ_జీవ జీవన మహాను
భావ భావజ రూపశ్రీ_ పావ_ వ పావన రాఘవ ॥రా॥
మాయ మాయెడ వద్దురా, ధ్యేయ ధ్యేయ విషయాశేల
రోయరో ఎప్పుడు దేవ_ రాయ రామా ఈ దేహము॥రా॥
రాజరాజ వందిత వి_ రాజరాజ హరే దిన
రాజరాజ నయన త్యాగ_ రాజరాజ దశరథ ॥రా॥

## 99

### వరాళి రాగము — ఆది తాళము

పాహి రమారమణ మాం
పాహి సద్గుణగణ హరే రామ ॥పా॥
చింతమాన నీదు కరుణ యను_
మంత రాదు హరే రామ ॥పా॥
ఎంతని సైరింతు నే
నెంతని వేగింతు హరే రామ ॥పా॥
చేతి మల్లెపూవు గుం
డ్రాతి కోర్వబోదు హరేరామ ॥పా॥
దోసపండు కెట్టు రామ
తోచు నినుపకట్టు హరే రామ ॥పా॥
అహాహ చిలుకకూన బ్ర_
హ్మాస్త్రమునకు తగున హరే రామ ॥పా॥
తల్లి తండ్రి బ్రోవకుంటే
తనయుని కే దోవ హరే రామ ॥పా॥

దేవదేవ నెన్న కత్తి
దెబ్బ కోర్చుకొనున హరే రామ ॥పా॥
రాజవర్య శరణ త్యాగ
రాజ వినుత చరణ హరే రామ ॥పా॥

## 100

### మధ్యమావతి రాగము — ఆది తాళము

శ్రీరామ జయరామ శృంగార రామ ॥శ్రీ॥
గారవమున బ్రోవు కరుణాసముద్ర ॥శ్రీ॥
నాలోని జాలి నీకేల తోచదురా ॥శ్రీ॥
మనసిచ్చి నాతోను మాటాడే దెప్పుడు ॥శ్రీ॥
తాళ నీవేళ నికతాళ మా రామ ॥శ్రీ॥
బలిమిని వలచితే చలమా ఓ రామ ॥శ్రీ॥
ఈసౌఖ్య మీభాగ్య మెందైన గలదా ॥శ్రీ॥
జపమేమో తపమేమో యపరాధమేమో ॥శ్రీ॥
పంకజనయన నాకుంకుమ నీవే ॥శ్రీ॥
అవనిజాధిప నా సొగసెవరిదే రామ ॥శ్రీ॥
నీవు నిమిషము లేసి భావుకమేలే ॥శ్రీ॥
తోషింప కెన్నాళ్ళుతోచునే రామ ॥శ్రీ॥
ఎల్ల సౌఖ్యములు మన సొల్లదే రామ ॥శ్రీ॥
పాయగా మేను సగమాయెనో రామ ॥శ్రీ॥
ఈ యంద మీచంద మెందైన గలదా ॥శ్రీ॥

కూర్చు వెతలార్చు కడతేర్చవే రామ ॥శ్రీ॥
మిక్కిలి మ్రొక్కి చేజిక్కితి రామ ॥శ్రీ॥
రాజిల్లు శ్రీ త్యాగరాజాధివినుత ॥శ్రీ॥

## 101

తోడి రాగము — దేశ్యాది తాళము

కడతేరరాదా మనసా ॥క॥

ఎడలేక భజనజేసి నీ
యెడగల్గు నిజదబ్బరలను తెలిసి ॥క॥

ఖలచిత్త లౌకికమనే శృంఖ
ఖలమందు తగలకనే ఉలూ
ఖలబద్ధునికి నిజదాసులై
విలసిల్లు త్యాగరాజుమాటవిని ॥క॥

## 102

షణ్ముఖప్రియ రాగము — ఆది తాళము

వద్దనేవారు లేరు ॥వ॥

అద్దంపు మోమును జూడ నే-
నయ మంగలార్చితే జూచి ॥వ॥

కోరిక లిలలో దివిలో-
కొంచెమైనలేని నా మనసు ॥వ॥

దారి తెలియు దైవము నీవుసుమీ
త్యాగరాజహృద్భూషణ నిను వినా ॥వ॥

## 103

ధన్యాసి రాగము — చాపు తాళము

నీ చిత్తము నిర్మలము నిశ్చలమని
నిన్నే నమ్మినాను ॥నీ॥
నా చిత్తము వంచన చంచలమని
నన్ను విడనాడకుమా శ్రీరామ ॥నీ॥
గురువే చిల్లగింజ గురువే భ్రమరము
గురుడే భాస్కరుడు
గురుడే భద్రుడగు గురువు నీవనుకొంటి
ధరను దాసుని బ్రోవ త్యాగరాజనుత ॥నీ॥

## 104

పంతువరాళి రాగము — రూపక తాళము

అప్ప రామభక్తి యెంతో గొప్పరా మా ॥యప్ప॥
త్రిప్పటులను దీర్చి కంటిరెప్పవలెను
గాచు మా ॥అప్ప॥
లక్ష్మీదేవి వలచునా లక్ష్మణుండు గొలుచునా
సూక్ష్మబుద్ధిగల భరతుడు చూచి, చూచి
సొలసునా మా ॥అప్ప॥

శబరి యెంగిలిచ్చెనా, చంద్రధరుడు మెచ్చెనా
అబల స్వయంప్రభకు దైవ, మచల పదవి
నిచ్చెనా మా ॥అప్ప॥

కపి వారిధి దాటునా కలికి రోటకుగట్టునా
అపరాధి త్యాగరాజు కానందము చాటునా మా ॥అప్ప॥

## 105

**ఖరహరప్రియ రాగము — ఆది తాళము**

చేతురాల శృంగారము
చేసి చూతును శ్రీరామ ॥చే॥

సేతుబంధన సురపతి సర
సీరుహ భవాదులు పొగడ నా ॥చే॥

మెరుగు బంగారందెలు బెట్టి
మేటియౌ సరిగవల్వలు గట్టి
సురతరు సుమముల సిగనిండ జుట్టి
సుందరమగు మోమున ముద్దువెట్టి ॥చే॥

మొలను కుందనపు గజ్జెలు గూర్చి
ముద్దుగ నుదుట తిలకము దీర్చి
అలకలపై రావిరేకయు జార్చి
అందమైన నిన్నురమున జేర్చి ॥చే॥

ఆణిముత్యాల కొండె వేసి
హాసుగా పరిమళ గంధము బూసి

వాణి సురటిచే విసరగ వాసి
వాసి యనుచు త్యాగరాజనుత అన్ని రోసి ॥చే॥

## 106

### కల్యాణి రాగము — చాపు తాళము

నిన్ననవలసిన దేమి రామ
నన్ననవలెగాక ॥ని॥
కన్నతండ్రి నీకన్న వేల్పు లెవ-
రున్నారుష్ణా యాపన్నరక్షక నే ॥ని॥
కన సైరించని దుర్జనుల భాషణలేక
మనసున నెనరున నిను జూచినానా
అనుదినమును నినుగన సజ్జనసేవ
వినయమునను నిజమున జేసినానా ॥ని॥
వినవయ్య మనవిని సనకాదివినుత నే
ధనమును, కొనిన భామను ప్రేమమీర
యెనయక మనసును వనజమున నతి వే-
గన పాదమున పూజనొనరించినానా ॥ని॥
కలిమానవులు సేయు చలకార్యములను నే
నిలలోను తెలియక వలతిచిగాని
కలలోను గలిగిన కలుములవలె నెంచి
వలచక బలు తపములు చేసినానా ॥ని॥
జలజాప్తకుల వరతిలక వీనుల నీ క-
థలు విన్న బలుపాపములు పోనుగాని

కలుముల పలుకుల చెలులు వశ్యులుగాని
తొలిజన్మముల పూజాఫలమేమో తెలియ
శరచాపధర యోగివరనుత పరిపూర్ణ
నరరూప నిరతము వరత్యాగరాజ
పరిపాల సురభూమిసురులను స్థిరమున
కరుణించే బిరుదు నీకరమున మెఱయ

107

రీతిగౌళ రాగము — దేశాది తాళము

చేరరావదేమిరా రామయ్య
మేరగాదురా ఇక మహా_
మేరుధీర శ్రీకర
తల్లిదండ్రిలేని బాల తననాధు గోరు రీతి
పలుమారు వేడుకొంటే పాలించరాదా
వలచుచు నేను నీదు వదనారవిందమును
తలచి కరగగజూచి త్యాగరాజసన్నుత

108

జనరంజని రాగము — ఆది తాళము

విడజాలదురా నా మనసు వినరా
అడియాసలచే దగిలి నే
నార్తిబడినా పదంబులను

తను వే పనులకు చనినా మతి
కనరానిది కనుగొనినా
నినుగా భావించి సంతసిల్లితి
శ్రీ త్యాగరాజనుత ॥విడ॥

## 109

### పంతువరాళి రాగము — ఆది తాళము

రఘువర నన్ను మరవ తగునా ॥ర॥
నగధర భక్తజనాఘనివారణ ॥ర॥
తల్లిదండ్రుడు లన్నదమ్ములు ఉన్న
పొలతికి ఒకడు పురుషుండౌనా ॥ర॥
పరదైవములు బాగుసొమ్ములు
సురనుత మంగళసూత్రములౌనా ॥ర॥
చేసిన పుణ్యచయము బ్రహ్మణ్య
ఆసనొసంగితి అనుపమలావణ్య ॥ర॥
మనసున నీకై మరులుకొన్నాను స_
జ్జనహిత త్యాగరాజవినుత శుభకర ॥ర॥

## 110

### దేశికతోడి రాగము — ఆది తాళము

రూకలు పదివేలున్న చేరెడు
నూకలు గతిగాని ఓ మనసా ॥రూ॥
కోకలు వేయున్న గట్టుకొనుట
ఒకటిగాని ఓ మనసా ॥రూ॥

ఊరేలిన తా పండుట మూడు మూర తావుగాని
నూరు భక్షణము లబ్బిన నోటికంతగాని
ఏరునిండి పారిన పాత్రకు తగునీరు వచ్చుగాని
సాంతరుని హరిని త్యాగరాజసన్నుతుని
మరవకే మనసా ॥రూ

## 111

### గౌళిపంతు రాగము — ఆది తాళము

మోసపోకు వినవే సత్సహవాసము విడవకవే ॥మో॥
దాసజనార్తిహరుని శ్రీరాముని
వాసవహృదయ నివాసుని తెలియక ॥మో॥
అల్పాశ్రయమున కల్గు వెసనములు
కల్పాంతరమైన బోదు శేష_
తల్పశయనుని నెరనమ్మితే నం_
కల్పమెల్ల నీడేరును మనసా ॥మో॥
ధన తరుణుల కాసించుటెల్ల
వెనుక తనువు కలసటెగాని
మనసుచేత సేవ్యుని దలచితే సు_
మనసత్వమును ఒసగునే మనసా ॥మో॥
గౌరవహీన ధనికుల గాచుటయు
నేరములకు నెడమౌను గాని
గారవించు త్యాగరాజహృదయా_
గారుని లోకారాధుని దలచక ॥మో॥

## 112

### సావేరి రాగము — చాపు తాళము

ఇంతకన్న దెల్పతరమా జగదీశ్వర
నే నీ కితరమా నీతో ॥ఇం॥
నీటిలోని రాజీవమురా రామ
నిను నమ్మి బ్రతుకు జీవమురా ॥ఇం॥
నీవే తన కిహపరము రామ
నిను నమ్మిన కాపురము ॥ఇం॥
రజనీశు జూచు కుముదము రీతి
రాజిల్లు నిను జూడ ముదము ॥ఇం॥
నీ కరుణే రాజయోగము రామ
నీ మాయయె రాజభోగము ॥ఇం॥
రాఘవ శుభకరమూర్తే త్యాగ
రాజు నీవాడని కీర్తే ॥ఇం॥

## 113

### శ్రీరాగము — దేశాది తాళము

నామ కుసుమములచే పూజించే
నరజన్మమే జన్మము మనసా ॥నా॥
శ్రీమన్మానస కనకపీఠమున
చెలగ చేసికొని వరశివ, రామ ॥నా॥
నాదస్వరమను వరనవరత్నపు
వేదికపై సకలలీలా వి
నోదుని పరమాత్ముని శ్రీరాముని
పాదములను త్యాగరాజహృద్భూషణుని ॥నా॥

## 114

### కల్యాణి రాగము — ఆది తాళము

ఏ వర మడుగుదురా శ్రీరాముని
పావనమౌ నీపాదభజన సేయుటకై ॥ఏ॥
దోవ లేబరమైనది దేవరా యిందు నే ॥నే॥
శ్రీరఘువీర సకలాధారక నీ మనసున
కోరిన పనులను పదసారసముల నా మన
సారగ విడవననే సారతరవైరాగ్యము
సారెకు సతతగతి కుమారుని పాలైనది ॥ఏ॥
నీలఘనాభ సదాకాలము నీభక్తుల
జాలములను కని పరిపాలనచేయుచు నీ
వోలికగాజూచే మేలునగల సౌఖ్యము
బాలుడగు రిపుఘ్నునిపాలై యుండగనే ॥నే॥
నీ మహిమల వినగా నా మనము దలచగా
భూమిని పదరేఖల్ల నేమరకను కనగ
తామరసనయన గుణధామ మనసు కరగే
ప్రేమరసము భరతస్వామి పాలై యుండగ ॥ఏ॥
వారము నీదు మనసుదారి ననుసరించుచు
నేరము లేకను, ఆహారనుషుప్తులను, ని
వారణచేయు పరిచారక భాగ్య మలం
కారియగు సుమిత్రకుమారుని పాలైనది ॥ఏ॥
శ్రీహరి భరితశరసమూహ సదా నిను హృ-
ద్గేహమునను దుర్గాహాఘ్నులను రోసి వి

వాహనుడు నీవను మోహంబునను మరచి
సోహమను సుఖము వైదేహిపాలై యుండగ ॥ఏ॥
ఈ జగతినిగల సుఖరాజిని మరి నిర్జర-
రాజపదంబును ఈజన్మము నడుగను
రాజవదన త్యాగరాజుని మదికెప్పుడు
రాజపదములైతే, జయమౌగాని ॥ఏ॥

## 115

### నవరసకన్నడ రాగము — దేశాది తాళము

పలుకు కండచక్కెరను గేరునే
పణతులాల చూడరే ॥ప॥
కొలువుకూటమును గొలుచువారిని
పిలిచి దాశరథి ప్రేమమీర బలికే ॥ప॥
సురల కామినీమణుల గాన మా-
దరణ నాలకించుచును శృంగా-
ర రసయుక్త వార రమణులాడ జూచి
సరస త్యాగరాజవరునితో బొగడే ॥ప॥

## 116

### తోడి రాగము — ఆది తాళము

కరుణజూడవమ్మ కమలవైరి కలాధరుని కొమ్మ ॥క॥
ధరను సరియు దొరకని పంచనదనగరనాయిక
ధర్మసంవర్ధని ॥క॥
అనేక జగదాధారివి నీ
వనే మదిని నెరనమ్మితిగా నే

మనేవాడనో యని నీమది నెం
చనే వద్దనుచు నాతనివేడు
దునే నాదుపై వినే చాడిచా
లునే నీదు దయకు నే పాత్రుడౌ
దునే కువలయనయనే సువసన
జఘనే విధునిభవదనే సంతతము ॥క॥

మదాన తెలియక జేసిన కర్మ
విదారి నీవని నమ్మితినే నీ
పదారవిందయుగళ భక్తిమ్మ
ని దానమడిగితినే తోచదేమి
ఉదారి నీదయను దాచరాదు ద
రిదాపు లేకను సదా మొరలిడ వి
నదా చెవులు ఎవరుదా బ్రోతురిక
సదాశివహితే ముదాన సతతము ॥క॥

పరాశక్తి నాయొకచిత్తము తా
మరాకు నీరు వితము తల్లడి
ల్లరాదు అందునకేమి ఫలము శం
బరారికి యర్ధశరీరి
పురాణపురుషుడగు రామునికి యా
పురారికిని నీకు రాజధరి మ
చ్చరాన వేరెంచరాదు అను త్యా
గరాజు నిక విడువరాదు సతతము ॥క॥

## 117

### మాయామాళవ రాగము — దేశాది తాళము

మేరుసమానధీర వరద రఘు
వీర చూతాము రారా మహా ॥మేరు॥

సారసార వొయ్యారపు నడలను
నీరదకాంతిని నీ ఠీవిని మహా ॥మే॥

అలకల ముద్దును తిలకపు తీరును
తళుకు చెక్కులచే తనరు నెమ్మోమును
గళమున శోభిల్లు కనక భూషణముల
దళిత దుర్మానవ త్యాగరాజార్చిత ॥మే॥

## 118

### కన్నడగౌళ రాగము — రూపక తాళము

సొగసు జూడ దరమా నీ ॥సొ॥

నిగనిగమనుచు గపోలయుగముచే మెరయు మోము ॥సొ॥

అమరార్చిత పదయుగమో అభయప్రద కరయుగమో ॥
కమనీయ తనునిందితకామ కామరిపునుత నీ ॥సొ॥

వరబింబసమాధరమో వకుళసుమంబుల యురమో
కరధృతశరకోదండ మరకతాంగవరమైన ॥సొ॥
చిరునవ్వో ముంగురులో మరి కన్నుల తేటో
వరత్యాగరాజార్చిత వందనీయ ఇటువంటి ॥సొ॥

## 119

మధ్యమావతి రాగము — దేశాది తాళము

రామకథా సుధారసపాన మొక
రాజ్యము జేసునే ॥రా॥
భామామణి జానకి సౌమిత్రి
భరతాదులతో భూమి వెలయు సీతా ॥రా॥
ధర్మా ద్యఖిలఫలదమె మనసా
ధైర్యానంద సౌఖ్యనికేతనమె
కర్మబంధజ్వలనాబ్ధినావమె
కలిహరమె త్యాగరాజవినుతుడగు ॥రా॥



## 120

బలహంస రాగము — ఆది తాళము

తలిదండ్రులు గల పేరుగాని
ఇల నీసరి దైవము లెనరే ॥త॥
ఇలు కలశసముద్రము గాకను నీ
కిల్లాలు విదేహతనయ భళి ॥త॥
గిరిశాది విధీంద్రార్క శశాంకా
మరకోటులు వానరులై కొలువ
ధరచక్ర ఫణీంద్రులు సోదరులై
తగివేడగ త్యాగరాజవినుత ॥త॥

శ్రీరామ శ్రీరామ శ్రీరామ